Regd No. N. 45 / M. 3813

౨౬౦౫

వెల ఒక అణా

గోలకొండ డైరీ

అయిపోవచ్చినవి

వెల ౧ రూపాయి

# గోలకొండపత్రిక

ప్రతి సోమ గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

హైందవుల పండుగలు

కర్త సురవరం ప్రతాపరెడ్డి

౩౦౦ పుటలు ౨ పటాలు

వెల ౧ రూ॥ మాత్రమే.

మేనేజరు గోలకొండపత్రిక

సంపుటము ౧౬ ★ హైద్రాబాదు, దక్కన్. శా. శ. ౧౮౬౩ వృషసం॥ర భాద్రపద బ॥ ౬ (౬-౧౨-౧౩౫౦ ఫ.) గురువారము. ★ సంచిక ౩౭

# రష్యాలో జర్మనుల మందగమనము

## చైనావారి గొప్ప విజయము

అమెరికా, జర్మనునౌకల పోరాటము.

---

### అమెరికా డిస్ట్రాయరుకు జర్మను జలాంతర్గామికి సంఘర్షణ

సెప్టెంబరు ౪ వ తేదినుండి ౬ వ తేదివరకు వచ్చిన ముఖ్యవిశేషవార్తలలో ఒకటి "గ్రీరు" అను పేరుగల అమెరికాడిస్ట్రాయరు ఐస్‌లెండుకు పోవుచుండగా సెప్టెంబరు ౪ వ తేదిఉదయము దానికిని ఒక జర్మనుజలాంతర్గామికిని సంఘర్షణ జరిగెను. ఆసంఘర్షణలో జర్మనుజలాంతర్గామి అమెరికావారి డిస్ట్రాయరుపై టార్పిడో వదలెను. అమెరికావారినౌక జర్మనునౌకను తరుముకొనిపోయి డెప్తుఛార్జీలు వేసెను. దానిఫలితము నిర్ధారణగా ఇంతవరకు తెలియదు.

ఈసంఘర్షణనుగురించి అమెరికాప్రభుత్వనౌకాశాఖవారు ఒక ప్రకటన చేసినారు. రూజ్వెల్టుగారుకూడ సెప్టెంబరు ౫ వ తేదిన దీనినిగురించి పత్రికాప్రతినిధులతో ముచ్చటించినారు. వీరలు చెప్పినవిశేషము లేమనగా, అమెరికావారినౌక అమెరికావారికి సంబంధించిన సముద్రప్రాంతములో నుండగానే జర్మనునౌక దానిపై నిష్కారణముగా టార్పిడో వేసినదట, అప్పుడు అమెరికానౌక ఒంటరిగా నుండెనట. అఅమెరికానౌకలో నివాసికులు తమనౌకనుండి జర్మనునౌకమీదికి అనేకపర్యాయములు డెప్తుఛార్జీలు ప్రయోగించుచు జర్మనునౌకవెంట తరుము కొనుచు పోయిరని తెలిపినారు.

జర్మనుఅధికారులు ఇదేసంఘటననుగురించిచేసిన ప్రకటనలో అమెరికానౌక తమనౌకపైదెబ్బ తీయగా ఆత్మరక్షణకై తాముటార్పిడో ప్రయోగించితిమని సమర్థించుకొన్నారు.

ఈసంఘటనపై అమెరికాప్రజలు ఆగ్రహోదగ్రులై అమెరికావెంటనే జర్మనీతో యుద్ధమునకు దిగవలెనని ఘోషలుచేయవచ్చునేమో యని మొదట కొందరనుకొనిరిగాని, అమెరికాలోని "న్యూయార్కు టైమ్సు" పత్రిక అమెరికాశాసనసభ్యులను కొందరినుండి సేకరించిన అభిప్రాయములను, ఇతరుల అభిప్రాయములను చూడగా, అమెరికాప్రజాభిప్రాయమును ఈసంఘటన యుద్ధోన్ముఖులనుగ ప్రేరించగలిగినంతదిగా కనిపించలేదు. అమెరికానౌకలరక్షణకై ఇకమీద అనౌకలపై పెద్దఫిరంగులనమర్చి నడిపించగలరనిమాత్రము కనపడుచున్నది.

### రష్యా జర్మనీల యుద్ధము

రష్యా, జర్మనీలసేనలకు అన్నిరంగములలోను ఘోరయుద్ధము జరిగినట్లు సెప్టెంబరు ౧వ తేదినుండి ౭వ తేదివరకువచ్చినవార్తలలో నున్నది. వేర్వేరురంగములయందు జరిగిన పోరాటములన్నిటిలో మిక్కిలిగొప్పది లెనిన్గ్రాడురంగమున జరిగినపోరాటము. జర్మనుసేనలక్కడ లెనిన్గ్రాడునకు౧౫మైళ్ళ పడమటనున్న, ౧౫మైళ్ళ దక్షిణమునకున్న మధ్యనుండు రష్యావారిదుర్గములను తాకినట్లు సెప్టెంబరు ౪వ తేదిన స్వీడనునుండి ఒకవార్తవచ్చియుండెను. కానిఇదిసత్యమని తేలకపోగా, సెప్టెంబరు ౭వ తేదినాటివార్త ననుబట్టిచూడగా జర్మనుసేనలింకెక్కడగాని లెనిన్గ్రాడునకు ఆగ్నేయదిశనగాని తూర్పుదిశనగానిచేరువరకు చేరలేదని కనిపించుచున్నది. ఆనగరసమీపమున రష్యావారిసేనలు చాలపట్టుదలతో జర్మనుసేనలను ఎదుర్కొని పోరుచు జర్మనుసేనలు ముందుకువచ్చిన ప్రదేశమునుండి వారలను కొంతదూరము వెనుకకుతరిమివేసినట్లు ౬వతేదిన రష్యావారు ప్రకటించినారు. కానిజర్మనుసేనలపెద్దతుపాకులను ప్రేల్చినపుడు గుండ్లుపోయి లెనిన్గ్రాడులో అక్కడక్కడ పడినట్లు సెప్టెంబరు ౬వ తేదినాడు అంకారనుండివచ్చినవార్తలో నున్నది. కాబట్టి మొత్తముమీద అందరనుకొనినదాని జర్మనుసేనలు లెనిన్గ్రాడునగరమును దక్షిణమునుండి చుట్టుముట్టుటకుయత్నించుచు కొంతదూరము ముందుకుపోగలిగినట్లే తలచుచున్నారు.

ఉత్తరరంగములో ఫిన్నులచేయుచున్న పోరాటముకూడగలదు. కారేలియాలో ఫిన్నిషుసేన ఆధ్వర్యము రష్యాను ఫిన్లండుకునుమధ్యనుండు పరిహద్దువరకు అన్నిచోట్లనుచేరినట్లును, ఇపుడు ముర్మాన్స్కు లెనిన్గ్రాడులమధ్యనుగల రైలుబాటవైపుపోవుచున్నట్లును స్వీడనునుండి ౪వ తేదినవార్త వెలువడినది. ఈప్రయాణములో వారలు వల్లా, కూపాలా, యుహాలమనాఅనుస్థానములను పట్టుకొనిరట. ఇదిరాజ్యంలో ఫిన్లండుచే రష్యావారికొసగబడియుండెను. మొత్తముమీదఇపుడు ఆర్కిటిక్ సముద్రమునందు "జెస్తలద్వీపకల్పము" అనుప్రదేశములోతప్ప తక్కినఅన్నిస్థానములందును ఫిన్లండునకు రష్యాకునుమధ్య పూర్వము ఏది సరిహద్దుగానుండెనో అపరిహద్దుకు ఫిన్నిషుసేనలు చేరుకొన్నవట.

మధ్యరంగములో రష్యావారిసేనలు ఇదివరలో పోగొట్టుకొన్నప్రదేశములను తిరిగిరాబట్టుకొనుటకై ప్రయత్నములుచేయుచున్నట్లు చూచియున్నాము. స్మోలెన్స్కునుమాస్కోను మధ్యగనుండు దూరమంతయు పైజాగానుండి దక్షిణమువైపుగా ఈరష్యావారిసేనలు పోరాడుచున్నవి. కాని గోమెల్ మీదినుండి జర్మనులుచేయుచున్న పోరాటమును ఈరష్యాసేనలు అపలేకున్నవని జర్మనులనుచున్నారు.

ఇదేరంగమందు మాస్కోను నైఋతిదిశలో ౨౦౦మైళ్లదూరములో మాస్కోనుండి కీవునకు పోయ్యెరైలుబాటపైనుండు బ్రియాన్స్కును జర్మనుసేన పట్టుకొన్నట్లు ఒకవార్తవచ్చినదిగాని దానినిజర్మనుఅధికారులు ఇంకనుఒప్పుకొనలేదు.

ఇకదక్షిణరంగమునందుకూడ జర్మనుసేనలు కొంతముందుకు నడువగలిగినట్లు వార్తవచ్చినది. కానిఇక్కడ నీపర్ నదినిదాటుటకు జర్మనులు సెప్టెంబర్ ౩, ౪, ౫ తేదులలో నాలుగుసారులు యత్నించిరి. కాని నాలుగుసారులును రష్యావారిసేనలువారలను గొప్పనష్టములతో తిరుగగొట్టినవి. ఈదెబ్బలో ౩౫౦౦జర్మనుసైనికులు మరణించినట్లును ౪౫లారీలు ధ్వంసమైనట్లును రష్యావారు ప్రకటించుకొనినారు. ఇక్కడ లెనిన్గ్రాడునకు౦ టెను చాలముఖ్యమైన పట్టణమనితలచబడు డోనెట్జు అను పరిశ్రమల ప్రదేశమును పట్టుకొనుటకై జర్మనులు త్వరలో గొప్పపోరాటమును ప్రారంభించెదరని వార్తవచ్చినది.

ఈనాలుగురోజులలో రష్యావారలు కొన్నికొన్ని జర్మనుసైనికదళములకు గొప్పనష్టములను కలిగించినట్లు ప్రకటించినారు. రష్యాజర్మనీలకు యుద్ధమప్రారంభమైన తర్వాత మొదటిరెండునెలలలో ౭౫౦౦జర్మనువిమానములను రష్యావారు ధ్వంసము చేసిరనియు, రష్యాపైకిజర్మనీనుండ యాత్రచేయుటకు ముందుగా౧౮లో ౩౦౦విమానాలు, ౧౮౪౦లో౬౦౦విమానాలు, ౧౮౪౧లో ౧౫౦౦-౧౮౦౦కు మధ్యనుకొన్ని విమానాలు జర్మనులవి ధ్వంసమైపోయియుండెననియు ఒకరష్యావారిపత్రికలో సెప్టెంబరు ౫వ తేదిన ప్రకటించబడినది.

సెప్టెంబరు౫వ తేదిన బాల్టిక్‌సముద్రములో ఒకజర్మను జలాంతర్గామిముంచివేయబడినదట. ఇంతవరకును ఒకరష్యానౌక జర్మనులచేముంచబడలేదట.

త్వరలో బ్రిటనునుండి విమానములువచ్చి రష్యాయుద్ధరంగమందు రష్యాసేనలకు సహాయపడగలవని రూటరుఏజన్సీద్వారా వార్తవచ్చినది.

ఈరష్యాయుద్ధములో జర్మనుపక్షమున బల్గేరియాసేనలుచేరి పోరాడవలెనని హిట్లరుతొందరపెట్టుచున్నాడు. కాని బల్గేరియాప్రభుత్వమువారు బల్గేరియారష్యాలకున్న మైత్రి ఈనాటిదికాదు ౧౦౦ కాలమునుండిఉన్నట్టిదనియు అందువల్ల కావలసినచో యూగోస్లేవియులలో పంటలకొరకు ౧౫౦౦౦మందిబల్గేరియనులనుపంపెదము గాని, సేనలనుమాత్రము రష్యాతో పోరాడుటకు పంపజాలమనియు, మరేయుద్ధరంగానికైన అయినట్లయితేపంపగలమనియు బల్గేరియాప్రభుత్వమువారు జర్మనుసేనలకు తెలియజేసినట్లు వార్తవచ్చినది. సెప్టెంబరు౩వ తేదిరాత్రి బల్గేరియాపార్లమెంటు ప్రత్యేకసమావేశము జరిగినతర్వాత ౪వ తేదిన మంత్రివర్గముకూడ సమావేశమై జర్మనీ, బల్గేరియాల సంబంధమునుగూర్చి ఆలోచనలుగావించిరట.

ముసోలినిగారుమాత్రము సెప్టెంబరు౬వ తేది ఉదయము మధ్యయిటలీనుండి కొన్ని ఇటాలియనుసేనలను రష్యాయుద్ధరంగమున జర్మనులకులోడ్పడుటకై ప్రయాణంచేయించిరి.

రష్యావారు బ్రిటిషువారినితమకు వారుచేసే సహాయమును ధర్మంగాచేయబనిలేదనియు, అప్పియ్యవలెననియు కోరిరనియు, అట్లీకావలసింతసహాయము రష్యాకుచేయబడుననియు బ్రిటిషు కోశాధిపతి సెప్టెంబరు ౬వ తేదిఉగయము ఒకఉపన్యాసములోచెప్పెను. ఇపుడుబ్రిటను ౧౫౦కోటి౧౦౦లక్షల పౌనులు ప్రతిరోజుయుద్ధానికై ఖర్చుచేయుచున్నదట. ఈసారిక్రొత్తగాపన్నులు వేయకుండా ప్రభుత్వపుఖర్చును ప్రజలిచ్చినఅప్పులతోను డొమినియనులు, ఇండియాచేసినసహాయములతోను సర్దవచ్చునని కోశాధిపతిగారు చెప్పిరి.

స్పెయినునుండి ఫ్రాంకోగారుకూడ రష్యాలో జర్మనులసహాయానికై వాలంటీర్ల డివిజనును పంపిరి.

### జర్మనులఇతర ఎత్తులు

నల్లసముద్రములో వార్నా, బర్గాస్ అనురేవులవద్ద జర్మనుసైనికసంచలనము ఎక్కువగాకనిపించుచున్నట్లు ఒకసమాచారము తెలిసినది.

### తురుష్కుకి జర్మనుల రాక

తుర్కీలో ఎక్కువపౌనులవిలునగల సరుకులను జర్మనుసరుకులిచ్చికొనుటకై ఒకఒడంబడిక చేసికొనువిషయములో రాయబారాలుసాగించుటకై జర్మను ప్రభుత్వపువాణిజ్యప్రధానాధికారి డా క్లోడియస్ ఆర్థికనిపుణులతో సెప్టెంబరు౩వ తేదిన తుర్కీకిచేరినారు.

### జపాను వ్యవహారము

జపానుప్రధాని అమెరికాఅధ్యక్షునికి ఒకసందేశమంపెననివినియుంటిమి, దానికి జవాబింకను రాలేదు, అసందేశములో పసిఫిక్‌ప్రాంతములో ఎక్కువసైనికులతో అమెరికాజపానులమధ్యచిక్కుగానున్నదని చెందుచున్న సమస్యలనుగురించి చర్చించుటకై అమెరికాఅధ్యక్షునకు రూజ్వెల్టుగారు ప్రార్థించబడినట్లు రూటరుఏజన్సీవారుచెప్పుచున్నారు, జపాను మాంచుకోలోను, ఇండోచైనాలోను, చైనాలోనుతనఆక్రమణలను వదలుకొనుట కిష్టపడునుగదా తూర్పుప్రాంతములో తననాయకత్వమునువదలుకొనుట కిష్టపడదుకదా. అమెరికాకు జపానువారిపై నమ్మకమంతయు గిట్టదుగదా. ఇకరూజ్వెల్టు, జపాను ప్రధానినికలిసి ఎంతమాట్లాడినను శాంతము గాసహాధానముకుదిరే అవకాశ మెక్కడిదని పలువురు నిరాశతోనున్నారు. ఈలోగా సెప్టెంబరుగవ తేదిన చైనాలో షాంఘాయినుండి ౫౦౦మందిఅమెరికనులు అమెరికాప్రయాణమైపోయినారు. బ్రిటనులో ఉండే జపానువారినిజపానుకును, జపానులో ఉండే బ్రిటిషువారిని బ్రిటనుకును పోనిచ్చుటకు ఉభయదేశాలప్రభుత్వాలకును సమాధానముకుదిరినది.

జపానుప్రధాని కొనోయిగారు సెప్టెంబరు౫వ తేదిన ప్రభుత్వప్రతినిధులయొక్కయు, యుద్ధపరిశ్రమలప్రతినిధులయొక్కయు సమక్షములో ఉపన్యసించుచు జపానుకు ఇపుడుదానిచరిత్రలో ఇదివరకెన్నడునులేని గొప్పచిక్కుస్థితివచ్చినదనియు, దానినితప్పుకొనుటకై వ్యక్తులు సొంతలాభములను మానుకొనక, అణుమాత్రమైనను వ్యర్థవ్యయము కానీయక జపానుసంపదను ఉన్నతస్థితికి తెచ్చుటకు తోడ్పడవలెనని యుచెప్పిరి.

సింగపూరులో మరికొన్ని భారతీయసేనలు సెప్టెంబరు౫వ తేదిన చేరినవి.

### చైనా విజయము

ఉత్తరచైనాలో జపానుసేనలవశంలో ఉండే ఫూకియన్‌రాష్ట్రమును తిరిగిఆక్రమించుటకై చైనాసేన ౩ అగస్టు ౩౧వ తేదిన బయలుదేరి మిన్‌అనేనదివెంటపోయి పూచౌను, లెన్‌కియాంగును, ఈ క్విఫావును పట్టుకొని సెప్టెంబరు౪వ తేదిన దాని ప్రధాననగరము ఫూచేను ఆక్రమించినవి. జపానుసేనలు హాంకాంగువైపు వెనుకకుతిరిగి పారిపోయి ఓడలెక్కి వెళ్లిపోయినవి.

ఫ్యూకియన్‌రాష్ట్రం సముద్రతీరమువెంట ఉన్నపట్టణములన్నిటిని చైనాసేనలుఆక్రమించినవి. ఇపుడుఆసముద్రంలో ఉండే దీవులను ఆక్రమించుటకై చైనావారు యత్నించుచున్నారు.

జపానువారికిని అమెరికావారికిని సంభాషణలింకనుసాగుచునే యున్నవి. కాని ఈసంభాషణ తెగ్గుముగిసినను చైనాకుఅమెరికాఇచ్చేసహాయాన్ని మానదని అమెరికావిదేశాంగశాఖమంత్రి కార్డల్‌హల్ గారు సెప్టెంబరు౫వ తేదిన చైనారాయబారికి అభయమిచ్చినారు.

ఇప్పుడు జపానువారు జపానులోను, కొరియాలోను, మంచూరియాలోను, తమవశంలో ఉండే చైనాప్రాంతములోను నిలవయుంచిన యుద్ధసామగ్రియు ఆహారసామగ్రియు చైనాతో యుద్ధముచేయుచు బ్రిటను, అమెరికాలుపెట్టిన ఆంక్షను ఒకసంవత్సరకాలముతట్టుకొనుటకు చాలునని, ౬ నెలలు ఇండోచైనానుండి దక్షిణమువైపుగా దండయాత్రసాగించుచుండుటకుగాని చాలునని, "ఎకనమిస్టు" పత్రికలో ఒకవిలేఖరి వ్రాసినాడు.

డచ్చివారి ఈస్టిండీసుదీవులకు మొదటిసారిగా కొన్ని అమెరికావిమానాలు సెప్టెంబరు౫వ తేదిన వచ్చిచేరినవి.

### ఇరాను వ్యవహారము

సెప్టెంబరు౭వ తేదినాటి రష్యావారిప్రకటనలో రష్యాసేనలు ఇరానులో మరిరెండు పట్టణములను పట్టుకొని ప్రధాననగరమునకు చాలచేరువకువచ్చినట్లుగలదు. అంతటితో రష్యావారిసేనలుఆగుటకై ఆజ్ఞప్తములైనవి.

ఇరానునుండితేలిపోయిన జర్మనులను తుర్కీవారి రాయబారికార్యాలయమందు ఉండనీయవలెనని తుర్కీప్రభుత్వమును జర్మనుఅధికారులు కోరినారు. తుర్కీప్రభుత్వమువారు నిరాకరించినారు.

ఇరానుప్రభుత్వముతో బ్రిటనురష్యాల ప్రతినిధులు ఇరానులో జర్మనులకుట్రలుతేకుండచేయుటకై తాము అవసరములనితలచేషరతులనుగూర్చి ఇంకను సంభాషణలు జరుపుచునే యున్నట్లు కనిపించుచున్నది. షరతులేవియు ఇంతవరకు బయటపడలేదు.

### యుద్ధప్రారంభ స్మరణ

సెప్టెంబరు౩వ తేదిన జర్మనులుయుద్ధము ప్రారంభించి యారేండ్లగును. ఆసందర్భమున బ్రిటిషుమంత్రివర్గమందలి ఒకమంత్రియగు గ్రీనువుడుగారు, ఆస్ట్రేలియా కార్మికనాయకుడగు కర్టినుగారును సెప్టెంబరు౨వ తేదిన వేర్వేరుప్రకటనలుచేసినారు. బ్రిటిషుబలమును బ్రిటనులోను ఇరాకు, సిరియా, ఇరానులలోను జర్మనులుఓడించలేకపోగా ఇపుడురష్యాతోయుద్ధంలో అపారనష్టములననుభవించుచున్నారనియు, బ్రిటనుకుఅమెరికాసహాయము పంపించకుండ చేయలేకపోయినారనియు; హిట్లరుసంపత్తి క్షీణించుచుండ బ్రిటిషుసంపత్తి వృద్ధియగుచున్నదనియు గ్రీనువుడుగారు చెప్పిరి. ఆస్ట్రేలియాప్రధాని ఫాడన్‌గారు ఉపన్యసించుచు బ్రిటిషుసామ్రాజ్యమును ఆసియాతూర్పుప్రాంతమందు యుద్ధములోకి దింపగలమని జర్మనులకునుండినఆశ ఇప్పుడుదూరమైపోయినదని చెప్పిరి. ఇదేసందర్భములో తాము ౧౦కు ప్రభుత్వమువారు రెండువేలపదాలుగల ఒకవిజ్ఞప్తిని అన్నిదేశాలకును చేసినారు, అందులో తమదేశము శాంతదేశముకనుక అందరినీ ప్రపంచశాంతిస్థాపనకై ఏదనుచేయగలిగినదంతయు వారుచేయవలెనని విన్నవించుటయైనదని తెల్పబడినది.

జపానువారు పసిఫిక్‌ప్రాంతసమస్యలవాలోచించుటకై దూరప్రాచ్యఅంతర్జాతీయ మహాసభ అనుదానిని ఏర్పాటుచేసి దానికి బ్రిటను, చైనా, అమెరికా, ఈస్టిండీస్, జపాను, న్యూజిలెండు, ఆస్ట్రేలియా, ఫిలిప్పైనురాజ్యముల ప్రతినిధులను టోయిలాండుచే ఆహ్వానింపజేయుటకు ఎత్తువేసినారు.

జపానీయుసైనికపత్రికల ప్రధానాధికారి సెప్టెంబరు౧వ తేదిన బ్రాడుకాస్టు ఉపన్యాసంలో జపాను మొత్తగానుండక బ్రిటను, అమెరికాలు చేయుచున్నముట్టడియత్నాన్ని సేనతో భగ్నపరచవలసినదనిరి.

### విమానాలదాడులు

బ్రిటనుపై జర్మనులదాడులును, జర్మనీపైనను, జర్మనుఅధికారానికిలోంగి ఇటలీవరకు ఉండుప్రదేశాలమీదను, ఆఫ్రికాలో ఇటలీవారిప్రదేశాలమీదను, ఇటలీవారిరేవుప్రదేశాలమీదను, బ్రిటిషు విమానాలదాడులు జరుగుచునేయున్నవి. కాని వాటిలో గొప్పవిశేషాలేవియులేవు. బర్లినునగరముపై రష్యావిమానాలదాడులుకూడ జరిగినవి.

### శత్రునౌకలవేట

సెప్టెంబరు ౪ వ తేదినుండి ౭ వ తేదివరకు బ్రిటిషువారి శత్రునౌకలవేటలో కొన్ని విశేషములున్నవి, ఒకఇటాలీయ జలాంతర్గామినౌక హెస్టియా అను బ్రిటిషు క్రూయిజరు ముంచివేసెను ఒకబ్రిటిషుజలాంతర్గామి మెసీనా జలసంధివద్ద కొన్నిశత్రునౌకలపై దెబ్బలువేయగా ఒకశత్రునౌక చాలాముట్టుకపాడైనది. ఒక ఇటాలీయ ప్రయాణీకులనౌక లిబియాకు సేనలుపోవుచుండుట ఇటీవల జరుగుచున్నట్లు తెలిసి ఒకనౌక చిక్కగా దానిపై బ్రిటిషు జలాంతర్గామిటార్పిడో వేసెను. అదిమునిగియుండవచ్చుననిరు బ్రిటిషువారినమ్మకము, సిసిలీసమీపములో ఒకఇటాలీయనౌక [పెటో]అది] బ్రిటిషువారిచే ముంచివేయబడెను. మధ్యధరాసముద్రంలో ఒక ఇటాలీయ సామగ్రినౌక ముంచివేయబడెను. ఒక బ్రిటిషు డిస్ట్రాయరునౌక ఒకరాత్రి రెండు శత్రుజలాంతర్గాములను ముంచివేసెను.

పోయిన రెండునెలలలోను అట్లాంటిక్‌సముద్రంలో జర్మనుయూబోటులసంఖ్య హెచ్చిందినను ఇదివరకు వాటికి దొరకుచుండిన బ్రిటిషునౌకలకంటె తక్కువనౌకలే చిక్కినవని సెప్టెంబరు౫వ తేదిన జర్మనులే రేడియోలో ప్రకటించుకొన్నారు.

### కమ్యూనిస్టుల అల్లరులు

ఫ్రాన్సులోను, జర్మనులాక్రమించిన హాలెండు మున్నగుఇతరదేశాలలోను కమ్యూనిస్టుల అల్లరులు జరుగుచున్నట్లును, అందుకై చాల కఠినశిక్షలు విధించబడుచున్నట్లును ఇంకనువార్తలు వచ్చుచునేయున్నవి.

జర్మనుఅధికారులు ఇట్టికమ్యూనిస్టులతో సంబంధముగల డచ్చివారు మరణదండనకు పాత్రులని రేడియోలో ప్రకటించినారు.

# ఉర్దూ వ్యాప్తి

## భాషలను ఏమహాశక్తియు అణచివేయజాలదు

### హిందూ ముస్లిం కలహాల మూలపురుషుడు- గాంధీ !!

### డాక్టరు హాక్‌గారి వ్యాఖ్యము

[హైదరాబాదులో ఉద్యోగముచేసి ఉపకారవేతనము పొందిన డాక్టర్ మౌల్వీ అబ్దుల్ హక్కుగారు అంజుమన్ తరఖ్ఖీ ఉర్దూ పత్రికలో ఉర్దూప్రాముఖ్యతను గురించి వ్రాయుచు కొన్ని అభిప్రాయాలను వెల్లడించినారు. అవి మాతృభాషలవారు గమనింపదగినవై యుండుటచేత ఆ భాగాలను ఉదహరించుచున్నాము. గో. ప.]

"శ్రీరామశర్మ అనువారు తమ విశాలభారత్ అను హిందీమాసపత్రికలో ఉర్దూహిందీ లిపి భేదాలవల్ల హిందూముస్లింకలహాలు జరుగుచున్నవను వాదము తప్పు- డాకా అహమదాబాదులలో జరిగిన కొట్లాటలకును దీనికి సంబంధములేకుండెను కదా అని వ్రాసినారు.

ఇదిసరిగాదు. హిందూముస్లింభేదాలకు మూలము ఉర్దూహిందీ వివాదమని యెవ్వరనుచున్నారో వారిఅభిప్రాయము సరిగానేయున్నది. ఏయే స్థలాలలో జనులమాతృభాష ఉర్దూకాదో లేక యెచ్చట ఉర్దూకుప్రాధాన్యతలేదో అచ్చటిజనులలో ఉర్దూకు ఎంతగౌరవమున్నదో అగౌరవము 'ఉర్దూ మాతృభాష' కానివారిలో లేదు. ఉర్దూమాతృభాషగాకలవారు ఉర్దూను ఒకవిధముగా పవిత్రభాషగాభావించుచున్నారు. ఉర్దూకుప్రాతినిధ్యత చూపింపబడుచున్నదని వారువిన్నప్పుడు లేక చూచినప్పుడు మరియు ఉర్దూను సమూలముగా తుడిచివేయ జూచుచున్నారని తెలిసినప్పుడు వారిహృదయములలో ప్రాతికూల్యత అసహ్యత యొక్క అగ్నిజ్వాలలు రగులుచున్న-ఆసోపోప్పు వారిట్లు భావించుచున్నారు.

ఉర్దూ ను తుడిచివేయజూచుట అంటే ఉర్దూమాట్లాడువారి సంస్కృతిని, వారిమతమును తుడిచివేయు ప్రయత్నముగానుండును.

పూర్వములో ఉర్దూహిందీ వివాదము స్థానికముగా ఏదోమూలలోనుండెను-కాని గాంధీజీ ఈసమస్యను తనఅధీనములోనికితీసుకొని హిందీ ప్రచారానికి పనుముకట్టిన నాటినుండి దేశమంతటను నిప్పంటుకొనిపోయెను-కాంగ్రెసుప్రభుత్వము ఈఅగ్నిపైనూనెపోసెను. హిందూముస్లిం కలహాలుపెరిగెను. మహాత్మా గాంధీగారు (దేవుడతనికి మంచిబుద్ధినిచ్చుగాత) దేశముయొక్క ప్రబలశత్రువులు కూడ చేయలేరని అపకారమును ఈ హిందీని రాష్ట్రభాషగాచేయు ప్రయత్నము మూలాన చేసినారు.

హిందూ ముసల్మానులలో అన్నింటికన్న ఎక్కువ పరస్పరమైనఅసహ్యము అవిశ్వాసము కలహముపుట్టిచేసినది ఈ ఉర్దూహిందీవివాదమే. ఈకలహానికి మూల కారకులు మహాత్మా గాంధీ గారే!

"ఉర్దూలిపి మొదలేచచ్చినది. దానిని మరల చంపకలసినపనిలేదు"అని శ్రీ రామ శర్మగారు వ్రాసినారు-ఇదిచాలా గర్వముతో చెప్పినమాట. తమసంఖ్యాగర్వమును చూచుకొని ఈ మాట అంటున్నారు

భాష, మరియు సంస్కృతి, సంఖ్యపైన ఆధారపడునట్టివి కావు.

ఉర్దూలిపి హిందీవలె కేవలము ఆర్యావర్తములోనే ఉండునట్టిదికాదు- అది హిందూస్థానముబయటిదేశాలలోను ఉన్నది-ఎక్కడెక్కడని దాన్ని తుడిచివేయగలరు? హిందూస్థానములో తెనుగు, బంగాలి, తమిళమున్నుగు చాలాలిపులు కలవు, వాటిని మొదట తుడిచివేయండి. తర్వాత ఉర్దూవంతు రావచ్చును.

లిపినిమార్చితే హృదయాలుమారవు మొదలు హృదయాలను సమ్మతితో, న్యాయముతో మార్చండి.

భాషా సమస్య సామాన్యమైనది కాదు. దానిపైన చేయివేయడం చాలా ప్రమాదకరమైన పని-ఎక్కడెక్కడ భాషపై చేయివేసినారో అక్కడక్కడంతయు నఫలముకాకపోగా దాని వెనువెంటనే చాలా ఆపత్తులు, కష్టాలు సంభవించినవని ప్రపంచ చరిత్ర నిరూపించుచున్నది. దానిమూలమున విప్లవములు జరిగెను. చెప్పరాని దౌర్జన్యాలను, దుఃఖాలను మోపినను నోళ్లనునొక్కివేసినను ఖైదులోనుంచినను, శాసన సహాయముతో అణచివేసినను క్రూరులు బాధితుల భాషను అధికారయుక్తులు తమకు లోబడిన వారియొక్క భాషలను తుడిచివేయజాలక పోయిరి. పైగా యీదౌర్జన్యము, ఈ కాఠిన్యము ఈ కష్టము, అణచివేయబడిన భాషలయొక్క అభివృద్ధికి హేతువయ్యెను.



## రాష్ట్రములో స్థానిక స్వపరిపాలనాభివృద్ధి

### ఇప్పటి స్థితి

ఇంతకుముందే దివానీఇలాకాయందలి జిల్లా ముఖ్యపట్టణములలోను, తాలూకాముఖ్యపట్టణములలోను ఏర్పడిఉన్న స్వపరిపాలక సంస్థల ద్వారా నిజాము రాష్ట్రమునందలి స్థానికస్వపరిపాలనము గతపదిసంవత్సరములపైనుండి అత్యంతాభివృద్ధినొందెను. ఇంతవరకు జిల్లాబోర్డులయందును, తాలూకాబోర్డులయందును సభ్యులలో ప్రభుత్వాధికారులు, ప్రభుత్వనియమితులైన అనధికారులు సమానసంఖ్యాకులు గానుండిరి. అంతేఅకుమించినజనసంఖ్యగల ఔరంగాబాద్, జాల్నా, నాందేడ్, గుల్బర్గా, రాయచూరు, లాతూర్, వరంగల్ పట్టణములందుగల పురపాలకసంఘములలో నియమితఅనధికారసభ్యులే అనేకసంఖ్యాకులుగనున్నారు 1౨ఇతరదివానీ పట్టణములలో హైద్రాబాదు లోకల్ సెస్ యాక్టుక్రింద పన్నులువసూలుచేయబడుచున్నవి. ఇందులోగలపట్టణములందు పురపాలకసంఘములు పనిచేయుటకును, తక్కినరెవిపట్టణములలో తాలూకాబోర్డులు పురపాలకసంఘములుపనిచేయుటకును మంజూరీఇవ్వబడెను. హైదరాబాదుమ్యునిసిపల్ కార్పొరేషన్‌లో ఎన్నుకొనబడినసభ్యులును, నియమితసభ్యులును సమానసంఖ్యాకులుగానున్నారు. అధ్యక్షుని ప్రభుత్వమువారు నియమింతురు. ఇలాకాలును, పట్టభద్రులు, జాగీర్దారులు, సాహుకార్లు, వర్తకులు తమతమసంఘములద్వారా నియమించుకొన్న సభ్యులును ఉందురు.

### రానున్న సంస్కరణములు

మహాఘనతవహించిన శ్రీనిజాంప్రభువారు లు ప్రసాదించినగవర్నెంటు లేటిటేదినాటి ఫర్మానుననుసరించి ప్రారంభింపబడనున్న రాజ్యాంగ సంస్కరణములతో పెద్దయెత్తుమీద స్థానికసంస్థలు నెలకొల్పబడుననియు, వీటికివిశేషమగు అధికారములుండుననియు, వీటిసభ్యులలో ఎన్నుకొనబడినవారిసంఖ్యయును అధికారుల సంఖ్యయును ౫ కెసంబంగసామ్యములోనుండుననియు తెలుపబడుచున్నది.

ఈసంస్కరణములలో జిల్లాబోర్డులు పునర్నిర్మాణమొనర్చబడును ..... గాని అంతకంటెఎక్కువగాని భూమికిస్తువసూలగు జాగీర్లలో జాగీరుబోర్డులును, లేక ఇలాకాబోర్డులును నెలకొల్పబచ్చును, ఇలాకాలేక జాగీరుబోర్డులు నెలకొల్పబడని ఇతరజాగీర్లుజిల్లాబోర్డుల క్రిందనుండును. జాగీరులుస్థానికపన్నులు వసూలుచేసి జిల్లానిధిలోనికి చెల్లించవలయును.

ఖర్చులుపోగా మిగిలినపన్ను మొత్తమంతయు సాధ్యమైనంతవరకు పన్నువసూలుచేసిన జాగీరయొక్కగాని ఇలాకాయొక్కగాని లాభమునకై ఖర్చుపెట్టబడును.

### తాలూకాబోర్డులు పోవుట

సూచింపబడిన ఇతరసంస్కరణములలో తాలూకాబోర్డులరద్దుయొకటి, ఇవిఇంతకుముందు పురసంఘములుగపనిచేయుచుండెను. 2వేలకును ౧౫వేలకునుమధ్య జనసంఖ్యగలపట్టణములలో పురసంఘములలో పురసంఘములు నెలకొల్పబడును. ఆత్రాఫ్‌బల్దా మొదలగు ముఖ్యపట్టణము అందును వర్తకప్రాముఖ్యముగలపట్టణములందు, ఆపట్టణములకు సంఖ్య౫౦౦౦కుతక్కువున్నను, పురసంఘములు నెలకొల్పబడును.

### పంచాయితీలు

౨౫౦౦కును ౫౦౦౦కుమధ్య జనసంఖ్యగల గ్రామములలో పంచాయతీలు నెలకొల్పబడును, గ్రామపునర్నిర్మాణసంఘములు పనిచేయుచున్న చెయ్యిపండితపైగా జనసంఖ్య గ్రామములలో ఆసంఘములే గ్రామపంచాయతులుగ ఏర్పడును. ఈహద్దులలో ఒకవెయ్యిపంచాయతులు నిర్మింపబడును-

ఈప్రతినిధిసంస్థల నిర్మాణములో ముఖ్యాంశములివి: అన్నిసంస్థలందును ఎన్నుకొనబడినవారు అధికసంఖ్యాకులుగనుందురు వారిసంబంధపాత్యము ౫:౩లోనుండును. రెండుపెద్దమతసంఘములవారును సమానసంఖ్యాయందుందురు ఎన్నుకొనబడినప్రతినిధులు ప్రాదేశికనియోజకవర్గములకు కాక నిర్ణీతస్థానికవృత్తులకు ప్రతినిధులైయుందురు, స్త్రీలకు ప్రత్యేకప్రాతినిధ్య ముండును,

వివిధస్థలనిధులను, పాఠశాలలను, వాటిలదాయమార్గములున్నను విషయములలోను నియమములనుతయారుచేయుపనియు, ఇప్పటియున్న లోకల్ ఫండ్ సంస్థల పునర్నిర్మాణమును, ఆడిటింగు, ఉద్యోగనియామకములున్నగునవి ఒకేవిధముగనుండుఏర్పాట్లుచేయుపనియు చాలవరకుపూర్తికానున్నది.

### ఇంతవరకుచేసిన పని

ఇంతకుముందు జిల్లాబోర్డులకును, పురసంఘములకును, రిఫాయెఆమ్, వైద్యవాహాయ్యము, విద్యాకార్యములుచేయుట్లకును యీమధ్యజైటులు విడివిడిగాతయారగుచుండెను. ఇప్పటిపద్ధతినితొలగించి ఈయేటినుండి ఒకేబడ్జెటును తయారుచేసిరి-

ఇదిగాక రాబోవుఫసలీసంవత్సరమునుండి మహాఘనతవహించిన నిజాంప్రభువారు లోకల్ ఫండుఉద్యోగులకొరకు ఒకరోగనిధిని ఏర్పాటుచేసిరి. ఈనిధియందు ప్రస్తుతము స్థానికసంస్థలు తమ మొత్తమునదాయము నుండి నూటికి పన్నెండున్నరచొప్పున ఇచ్చు మొత్తమునుండి ఖర్చుపెట్టబడును.

నియామకములు, బదిలీలు, తరక్కీలు, క్రమశిక్షణమున్నగునవన్నియు ప్రభుత్వ లోకల్ ఫండు డిపార్టుమెంటువారివశమై యుండును-

—హైదరాబాదు సమాచారము నుండి

# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర భాద్రపద బ॥ ౮

గురువారము


## ఇందూరులో సమాజాభివృద్ధి.

ఇందూరు సంస్థానము గొప్పసంస్థానాలలో ఒకటియై యున్నది. దాని సంబంధమగు ముఖ్య వివరాలు పాఠకుల జ్ఞాపకార్థము తెలుపుకొనుచున్నాము.

వైశాల్యము—౯౯౦౨ చదరపుమైళ్లు.
సంవత్సరాదాయము—౧౨౪౨౧౦౦౦
జనసంఖ్య—౧౩౨౫౧౭౯
ప్రభువు మహారాష్ట్రి హిందువు.
ప్రజలలో విశేషభాగము అనగా నూటికి ౯౦ వంతులు హిందువులు.

అట్టి ఇందూరు సంస్థానము ఇదివరలోని మహారాజుకాలములో కొంత అపఖ్యాతికివచ్చియుండెను. ఆరాజుగద్దె నువదలుకొనెను. ఇప్పుడు అతనికొమారులు రాజ్యము చేయుచున్నారు.

ఇందూరు సంస్థానముయొక్క పరిపాలకులయొక్క స్వీయచరిత్ర యెట్టిదైనను, అచ్చటిప్రభుత్వములో రాజకీయముగా ఎన్నిలోపాలుండినను, సంఘసంస్కారసంబంధమగు కొన్ని విషయాలలో ఆసంస్థానము చాలాముందునకునడిచిపోయినదనవలెను. ఇతర దేశసంస్థానాలు చాలావరకు సంఘసంస్కరణములో ఇందూరుకన్న వెనుకబడినవి. ఇక బాల్యవివాహమును త్రోసిపారవేసిన మన హైద్రాబాదు శాసనసభా మూలమున మనహైద్రాబాదురాష్ట్రమన్నిటికంటె వెనుకస్థానములో ఉండిపోయినదనవలసివచ్చుచున్నది. మరి ముందుకాలములోనైనా ఏమైన అతిగతి తేలుతుందా అంటే దానికిన్ని ఆశలేదు. ఒకదిక్కుసనాతనులులేచికూర్చున్నారు. వారినిషాబాష్ జిందాబాద్ అని పీపుతట్టేవారికికొదువలేదు. ఈసనాతనులు ఒకటింపావుకోటి రాష్ట్రహిందువులకు ప్రతినిధులట! వారేమన్నను చెల్లుతుందిలెండి!!

మనప్రభువుగారు ముసల్మానులు ప్రభుత్వము ఇస్లామీ సామ్రాజ్యమయ్యెను. ప్రజాబాహుళ్యమా హిందువులతోకూడినదయ్యెను. ఇప్పటి శాసనసభలో ముసల్మానులేఅధికముగాఉన్నారు. ముందుకు వారే ఎక్కువగాఉండే గణితశాస్త్రపద్ధతిపై సంస్కరణశాసననిర్మాణము జరిగినది. ఇట్టి వాతావరణములో ఏహిందూసంస్కరణశాసనమునైనా ఎట్టి పెద్దమనిషిప్రవేశపెట్టినసరే మన సనాతనభాయీలు ఉండనే ఉన్నారు కదా. "మాధర్మంమునుగుతుంది- మాశాస్త్రి పొప్పుకోవు. ఒకటింపావుకోటి హిందువులందరికిన్ని మేమే ప్రతినిధులముగా ఏర్పడినాము- మాశాఖలు ప్రతితాలూకాలోఉన్నవి. మావాదానికిబలకరంగా ఊరూరునుండి లక్షల అంగుష్ఠ ముద్రలున్నూ,కొన్ని సంతకాలున్నూ,మంచివోచెడ్డవో కమిషనిచ్చో, అబద్ధప్రచారంచేసియో యేమైనకేనాప్పుపాయేమ అబద్ధంవాసుబద్ధంవాపద్ధతిపైన తెచ్చిశాసనసభ్యులు డంగై దద్దరిల్లిపొయ్యే అట్లుగా కట్టలుకట్టలుగా ఎవ్వరును అడుగకముందే తెచ్చిపడవేసినాము." అని వాదింపవచ్చును. "ఓహో! మీలోమీరు సమాధానపడకుంటే మేమేమిచేస్తాము" అని అమెరీగారు విషయాంతరాలలో సెలవిచ్చినట్లుగా హైద్రాబాదు శాసనసభవారున్నూ తుదకు ప్రభుత్వమువారున్నూ అనవచ్చును. ఫలితమేమంటే ఎన్నటికిన్ని హైద్రాబాదు రాష్ట్రములో సంఘసంస్కార శాసనాలకు అవకాశముండదు.

ఇక ఇందూరును చూడండి. ఇందూరురాజు హిందువు. ప్రజలలో నూటికి ౯౦ హిందువులు. అక్కడనూ సనాతనులు బలంగాఉంటారు. అయినాఅచ్చట కావింపబడిన శాసనాల పట్టికను చూడండి.

౧. ౧౯౧౮ సంవత్సరములో "ఇందూరు సివిల్ వివాహ శాసనము" కావింపబడెను. దాని ద్వారా వర్ణాంతర వివాహాలు హిందువులు బాగాచేసుకొనవచ్చును. అట్టివారి సంతానం అక్రమసంతానం కానేరదు.

౨. ౧౯౨౧ లో ఇందూరు బాల్యవివాహ నిషేధశాసనము కావింపబడెను. ౧౫ ఏండ్లకు తక్కువ వయస్సుగల బాలురకును ౧౪ ఏండ్లకన్న చిన్నవారైన బాలికలకును వివాహాలు చేయకూడదనిశాసించిరి. ఇది ౨౩ ఏండ్లక్రిందటి ముచ్చట!

౩. ౧౯౨౭ లో హిందూ వితంతూ ద్వాహశాసనము కావింపబడెను.

౪. ౧౯౩౭ లో వృద్ధ వివాహ నిషేధ శాసనము కావింపబడెను. అనగా ౪౫ ఏండ్లకన్న మించిన మగవాడు ౧౫ ఏండ్లకు లోబడినస్త్రీని వివాహమాడకూడదని నిషేధించినారు.

౫. వివాహ వ్యయముల శాసనము ఒకదానిని చేసినారు. ఎటువంటివారైననుసరే ౧౦౧ మందికంటే ఎక్కువ మందిని వివాహాలలో భోజనానికి పిలువకూడదు.

౬. అన్నింటికన్న ముఖ్యమైనది హరిజనులకు దేవాలయ ప్రవేశమిప్పించుట. ౧౯౩౮ లో ఇప్పటి మహారాజాగారు ఒకఫర్మానును ప్రకాశమానము చేసిరి. దానిప్రకారము ఈక్రింది ఆజ్ఞలు కావింపబడెను.

అన్ని సంస్థాన దేవాలయములలో హరిజనులకు ప్రవేశాధికారము కలదు.

సర్కారీ బావులన్నింటిలో హరిజనులకు ప్రవేశముకలదు.

హరిజనులు సవర్ణులుండు వీధులలో ఇష్టము వచ్చిన చోట ఇండ్లు కట్టుకొని నివాసము చేయవచ్చును.

అన్ని సర్కారీబళ్ళలో హరిజనులకు ఆటంకము లేకుండా ప్రవేశముకలదు.

(ఈ ఆరు శాసనాంశాలను సెప్టెంబరు మాడర్న్ రివ్యూలోని ఒక వ్యాసమునుండి గ్రహించినాము)

ఈ విధముగా ఇందూరుసంస్థానములో ౧౯౧౮ నుండి ౧౯౩౮ వరకు ౨౦ ఏండ్లలో ఆరుముఖ్యమైన సంస్కారశాసనాలు కావింపబడినవి. అందులో తుదిదైన హరిజనులకు దేవాలయాదులలో ప్రవేశమిప్పించుశాసనము అన్నింటికన్న ముఖ్యమైనది. తిరువాన్కూరు మహారాజా మొట్టమొదట హరిజనులకు దేవాలయ ప్రవేశమిప్పించి దేశీ ప్రభువులకందరికిని దారిచూపెను. తిరువాన్కూరులో ఉన్నంత పూర్వాచారపరాయణత, ఆచారకాఠిన్యత, వర్ణాశ్రమాచారపు పట్టుదల, ప్రపంచములో మరెచ్చటనులేదు. అట్టి దేశములో హరిజనులకు దేవాలయప్రవేశమిప్పించుటకై మహారాజుగారి ఫర్మాను ఆమెనుకదా. అచ్చటిసనాతనులు సంఘాలు స్థాపించలేదు. సంతకాల బేరమూ చేయలేదు. ప్రతికూల ప్రచారమూ సాగింపలేదు. "ఘోరంమహాఘోరం, శాంతం పాపం" అని చెవులు కండ్లుమూసుకోలేదు. అంతయు చల్లగా జరిగిపోయింది. మరి ఇందూరు సంస్థానములో అట్టి ఫర్మానే హరిజనులకొరకై కావింపబడిందని చాలా మందికి తెలియదు. అక్కడకూడా సనాతనులు జండాలు పట్టుకొని తిరిగినట్లు, ఫోటోలుతీసుకొన్నట్లు, విజయసంచికలు ప్రకటించినట్లు, ధర్మ సంస్థాపనకై హాహాకారాహాహోరిగా పోరాడినట్లువినలేదు. అక్కడకూడా అంతయు చల్లగాజరిగిపోయింది. ఇప్పుడచ్చట హరిజనులు సవర్ణులనబడువారి వీధులలో వారి యిండ్ల మద్యనే యిండ్లుకట్టుకొని సుఖముగా గౌరవముగా జీవించుచున్నారట.

ఇందూరుసంస్థానమువారికి ధన్యవాదములను ఒకటింపావుకోటి హిందువులపక్షాన కాకున్నను సంస్కరణాభిలాషులగు హిందువులందరిపక్షాన అర్పించుచున్నాము మనకులేకున్నను సోదర సంస్థానములలో ఏమేమిజరుగుచున్నదో ఎట్లెట్లుజరుగుచున్నవో మనరాష్ట్రవాసులు తెలుసుకొనుచుందురుగాక.

## హిందూ జాతీయవాదులు అడ్డువచ్చుచున్నారు

గోపాలరావుగారు ప్రభుత్వాన్ని విమర్శించుట

గోపాలరావు బూర్గాంకరుగారు ౨౧ అగస్టు నాడుజరిగిన హిందూప్రజామండలి వార్షికోత్సవములో ఈక్రిందివిధముగా ఉపన్యసించినాడని దక్కన్‌క్రానికల్ పత్రికలో ముద్రించినారు:—

జాతీయవాదులమని పేరుపెట్టుకొన్న హిందువులు మాకుఅడ్డువచ్చుచున్నారు. వీరుతమసభలలోఉండేభావాలను నిర్భయముగా ప్రకటింపజాలకున్నారు. మండలివారు ప్రభుత్వమువారికితమకష్టాలు తెలుపుకొని సహాయముకోరువారు, జాతీయవాదులెప్పుడును మండలివారికి వ్యతిరేకప్రచారముచేయువారు. ప్రభుత్వమువారిలో మండలివారు సహకారము వీలైనంతవరకు చేయగోరువారు. హిందువులకున్న యిబ్బందులు ప్రభుత్వాజ్ఞలవలనకలుగుచున్నవి సర్కారీఉద్యోగములుపూర్వముహిందువులెక్కువగా ఉండిరి. ౧౯ సురానువారికిఅల్పస్థానమేర్పడింది- భూపరాధీనశాసనమువల్ల హిందువులకు నష్టముకలుగుచున్నది హిందువులలోకులభేదాలుబహుపరచి వారినిభిన్నించుచున్నది ఈశాసనము.

హిందువులపైనను ముఖ్యముగా హిందూబాలికలపై మనప్రభుత్వమువారు ఉర్దూనుబలవంతముగా మోపుచున్నారు.

## ఛతారీ నవాబుగారి కృతజ్ఞత

ప్రభువుగారికినివేదన

౨౪ మెహర్ నాడు సుబేదక్కన్‌లో మ ఘ.న. నిజాంగారు కొత్తప్రధానమంత్రిఅను పకటముతో వ్రాసినదానికి ౨౫ మెహర్ నాటి సుబేదక్కన్ పత్రికలో ఛతారీనవాబు గారిట్లువ్రాసినారు—

ఆలాహజ్రత్ దక్కన్, బరారు ఖుస్రూగారి దివ్యసన్నిధానములోనికి—వినమ్రవిజ్ఞాపన యేమనగా

ఓలోకపూర్యా ఈనాటి సుబేదక్కన్‌లో ఈరాజ్యశ్రీవారియొక్క సాధారణగుణాలను గురించి (అమీరుల్ ముసల్మీన్) ముసల్మానుల ఏలికయొక్క ఏఫర్మాను ప్రకాశమానమైనదో అదిప్రత్యేకగౌరవార్హమైనదైయున్నది. దానివలనరాజ్యశ్రీక్షేమమునుచింతకుడైన ఈజనుడును ఇతరనిస్సంశయవారును శాశ్వతముగాగర్వించుచుండ గలరు.

ఈసేవకుడు శ్రీవారిసన్నిధిలో ఒకకెక్కేనిసరసూణువుగానుండెను. అట్టివానిని వైభవోపేతుడగు పాదుషాగారి కరుణాకటాక్షలేశము ఒకపరిచితమగు చలసరహితపత్రమును చలనసహితముగా చేసివేసెను నేనెంత? నాఅధికారమెంత? ఆయిబ నాఅల్పత్వము సామర్థ్యరహితత్వము గమనించకవిధేయతతో దేవునిసన్నిధిలో ప్రార్థించుటయేమనగా పూజ్యప్రభువులుంగారు ఏయేఆశయములతో ఈఅల్పునియొక్క నియామకముచిత్తగించియున్నారో వాటినిపూర్తిచేయుటకై ప్రయత్నించుచుందును.

ఈసేవకుడు ముఖ్యవిధులయొక్క గొప్పభారమునుమోయుటకు ఏయుద్దేశముతోను ఆశయముతోను సామాపించిసాధనగా పరమాత్మచ్ఛాయయైన ప్రభువులయొక్కవిశ్వాసము నాజీవితముయొక్క ఉద్దేశమైయుండును రాజనీతివేత్తముఖ్యులైనప్రభువుగారినీతియుక్తమైన ఆజ్ఞలనీడలో ఏలికయొక్కయు దేశముయొక్కయుఅభివృద్ధినావిధులలో ప్రప్రథమమైనవిగానుండెను. దేవునిఅనుగ్రహమువలన అసఫియారాజ్యమునకు నిజమైనసేవచేయుటకు నాకుఅవకాశముకలుగుగాక. కాని ఈప్రయత్నములో విజయముందుటకు గురువరేణ్యులగు శ్రీవారి దివ్యమమార్గదర్శకముయొక్క అధీనుడనైయున్నాను. ఇంతకన్న అధికం మర్యాదాతిక్రమణమగును. దేవుడు పాదుషాగారియొక్క ఆయువు సంపద సూర్య చంద్రులుండు పర్యంతము ప్రకాశింపజేయుగాక—

విశ్వాససేవకుడు,

అహ్మద్ సయీద్

[విజ్ఞాపనపత్రిక ౨ సెప్టెంబరు ౪౧].

## పాఠకులకు మనవి.

"పల్లెపాటలు" పూర్వమునుండియు ప్రచారములో ఉండునట్టివి పాఠకులు తమతమ ప్రాంతములలో సేకరించవలెనని కోరియుంటిమి. కొందరు పంపిరి- రెండుమాసాల తర్వాత ఎవ్వరునుపంపకపోయిరి- అవిచాలా అవసరము- పల్లెజనులభావాలు, వారిభాష- వారిజీవనం ఈపాటలలో వ్యక్తమగును- కావున పాఠకులు వాటివిషయమై శ్రద్ధవహించి పంపించుచుండగలరు-

తమతమ ప్రాంతాలలో ఏయేతందానకథలుప్రచారములోనున్నవో అవియు సేకరించి యుంచుట చాలాముఖ్యము- కొన్నితందానకథలు ముద్రితమైనవి- అచ్చుకాని కథలుచాలాకలవు- తమతమ ప్రాంతాలలోని కథలేవో వాటినివిని వచనరూపముగా వ్రాసి అందుపై వీలైనంతవరకుస్థలకాలముల నిర్ణయములచేసి వ్రాసిపంపగలరు-

గో. ప. సం.

## సూర్యగ్రహణం

పంజాబులో ఖాన్వేశ్వరములో సూర్యగ్రహణమునిమిత్తముపోయ్యేవారు కలరాటీకాలుతీసుకొని పోవలసియుండును.

## కొలనుపాక సభ ఆగిపోవుట

బీబీనగర్, ౧౧-౧౨-౫౦ ఫ.

(ఒక విలేఖరి)

చ ౨౫ గురువారము రోజున నవాబుయార్‌జంగు బహద్దరుగారి అధ్యక్షతన పైగ్రామమున మద్యపాన నిరోధకసభ జరుగగలదని నిరీక్షణముయమునకు వెళ్ళితిమి. గ్రామమునకు కొద్దిదూరమందుండగనె చాలామంది తిరిగి వారివారి గ్రామములకు వెళ్ళిపోవుచు సభజరుగజాలదనిచెప్పిరి కారణముపూర్తిగ తెలుసుకోవలయునని అక్కడికివెళ్లి కార్యకర్తలను విచారించగ, చ౨౪ బుధవారము పగలు ఒకటిన్నరఘంటకు హైద్రాబాదు మద్యపాననిరోధక కేంద్రసంఘమునుండి ఒక భృత్యుడు మురాసిలా తీసుకొనివచ్చెనని తెలిపెను. అందులో యార్‌జంగు బహద్దరుగారికి వేరేపనులుండుటమువలన, సభకురాజాలనని వ్రాసిరట. ఈసభ మాడనుత్సాహముతో ఒక ౧౨ గ్రామాలనుండి దాదాపు పదిపన్నెండు వందలమందివచ్చి సభజరుగనందుకు నిరుత్సాహముతో తిరిగివెళ్ళిరి. వచ్చినవారితో స్థానిక కార్యకర్తలు మళ్ళీ వారము పదిదినములకు సభ జరుపగలమని మళ్లీమీకుఆహ్వానములు పంపగలమని ఇప్పటికన్న ఎక్కువసంఖ్యతో రావలయునని కోరిరి. మనని జాంరాష్ట్రములో అధ్యక్షులవారి ఆటంకమువల్ల జరుగజాలనిసభ ఇదియేప్రథమముఅయి యుండవచ్చును.

### మద్యపాననిరోధసంఘ ఉపాధ్యక్షురాలి ప్రకటన

కొలనుపాకయందు హైద్రాబాదు మద్యపానకేంద్రసంఘమున చ ౨౫ ఉమాయి ౫౦ ఫ. శేష్తవారము బహిరంగసభ జరుగవలసియుండెను- కొన్ని అనివార్యకారణాలవల్ల సభనుప్రస్తుతము జరుపజాలమనియు, వేరేఅనుకూలముగ మరుదినముయేర్పాటుచేసి తెలుపగలమనియు వర్తమానముదీకొలనుపాక మద్యపాననిరోధసంఘమువారికి హైద్రాబాదు కేంద్రసంఘమువారు మురాసిలాద్వారా తెలిపిరి. భువనగిరి, జనగాము, సిద్దిపేట, అంబర్‌పేటతాలూకాలలోని సుమారునూర్గ్రామాలవారికి కొలనుపాక సంఘమువారు ఆహ్వానములుపంపియుండిరి. గురువారము ఉదయమునుండి సాయంత్రమువరకు వేనవేలుప్రజలువచ్చి సభజరుగనందుకు చింతిల్లి తమతమగ్రామాదులకు తిరిగి వెళ్ళిరి. ఇతరగ్రామాలనుండి సభకువచ్చినవారలకు ఫలహారములయేర్పాటుగావించి, అతిథిసత్కారములుగావించి, వచ్చినపెద్దలకునచ్చచెప్పి, స్థానిక మద్యపాననిరోధసంఘమువారు వారినిసాగనంపిరి. సంఘాధ్యక్షులుగారు అక్కిమారసింహారెడ్డిగారు కేంద్రసంఘాధ్యక్షులగు నవాబు యార్జంగుగారితోకలిసి మాట్లాడిగా వారము పదిదినములలో తిరిగికొలనుపాకయందే బహిరంగసభ కావించెదమని నమ్మకముగ చెప్పిరి. ఈవిధముగ బహిరంగసభ కాజాలనందువల్ల సభకువచ్చినవారలందరకు చాలఆశాభంగముకలిగెను- మను ముందుసరియైనయేర్పాట్లుగావించి మాసంఘమునకు తెలియపరచవలసినదని కేంద్రసంఘమునకు మేము తెలుపుకొనినాము.

ఇతరగ్రామాలనుండి సభకువచ్చినవారిపేర్లను, గ్రామవిలాసములను స్థానికపోలీసువారు నోటుచేసికొనిరి-

ఇట్లు,

కమలాదేవి,

కొలనుపాక మద్యపానసంఘ

ఉపాధ్యక్షురాలు.

### మరణము

హైదరాబాదు మిలటరీశాఖాకార్యదర్శియైన నవాబు తీర్‌జంగుగారు ౨౮ అబాన్ నాడు చనిపోయెను వారిశవాన్నిగోరీలోపెట్టు సమయములో మ-ఘ-న-నిజాంప్రభువుగారున్నూ వెళ్లియుండిరి-

## బొమ్మసైనికులతో జరనుల మోసము

జర్మనులుక్రీటుయుద్ధంలో పారషూటులనుండి నిజమయినసైనికులను రహస్యంగా ఎక్కడనో దింపి ఆసైనికులకు వారలతోపోరాడవచ్చినఆస్ట్రేలియాసైనికులు ఎక్కడనుండిరో చూపుటకై ఆస్ట్రేలియాసైనికులయెదుట పారషూటు నుండి జర్మనుసైనికుల వలెనేయుండుబొమ్మలను దింపిరట ఆబొమ్మలుపూర్తిగా భూమిపైదిగునంతవరకు ఆస్ట్రేలియాసైనికులు వాటినిబొమ్మలని తెలిసికొనలేకపోయిరి- ఈబొమ్మలతో మోసముచేసేపద్ధతిని కనిపెట్టినవాడు జనరల్ క్యూడర్ అనునతడట-

## అడవి జాతులవారి సత్యసంధత

అగస్టునెలలో వెరియర్ యల్విన్ అను పాదిరీ దొరగారు బొంబాయిలో రేడియోలో నుపన్యసించుచు అడవిజాతులవారలనుండి నాగరికులు నేర్చుకొనవలసినగుణములను చెప్పి, వారునిజముగా సాధువులనిరి.

అడవిజాతివాడు చదువుకొన్నతర్వాత అబద్ధాలుచెప్పుట ఎక్కువగా నేర్చుకొని, మోసముచేయుటకుప్రారంభించును. అసలు అడవిజాతివాడు నిష్కపటి, సత్యసంధుడు, ఎక్కడగానిచెట్టుమీద అతనికి తేనెకనబడినచో, ఆచెట్టుక్రింద అతడు కొన్నిగుర్తులనువ్రాసియుంచును, అట్టి తేనెను మరెవరును తాకరు.

వారలలో బాయిగాలున్ను, మురియాలున్ను యిండ్లకులుపులకు తాళములు వేసికొనరు. గడపవద్ద కొన్నికొయ్యలనుమాత్రముంచెదరు, అట్టియింటికి ఇతరులెవ్వరును ఇంటిలో ఎవరుగానిలేనివేళ రారని వారలకు తెలుసును.

హత్యాదోషము అరోపించబడిన అడవిమనుష్యుడు ఆదోషమునుఒప్పుకొని, ఎందుకట్లుచేసినదిచెప్పును. ఒకవకీలు తనఎదుటిపార్టీవారు ఎవరినేని బాయిగాను సాక్షిగాపిలిపించినచో తనకక్షిదారుని అరోగమును వదలుకొనవలసినదిగ సలహానిచ్చుచుండునని ఎల్విన్‌గారితో చెప్పియున్నారట అనగాబాయిగాచే తప్పుడుసాక్ష్యముచెప్పించుట కష్టమట.

ఇదిఅడవిజాతివారిలక్షణము. కానిమననాగరికప్రపంచమందెక్కడచూచినను అంతాదొంగప్రచారము, అసత్యములే, అందువల్లమననాగరికతవల్లలాభమేమిఅని ఎల్విన్‌గారుఅడిగినారు.

మనపట్టణములో ఎక్కడగాని బాలురకు మిఠాయిపంచిపెట్టదలచినపుడు ప్రతిబాలుడుతోడివారలకంటె ఎక్కువమిఠాయిపొందవలెనని ముందుకుత్రోసికొనివచ్చుట చూచుచున్నాము. కాని మురియాలుండేగ్రామంలో మిఠాయి పంచిపెట్టబోయినచో బాలుర తమలోరావలసినవారందరు వచ్చునంతవరకు మిఠాయినిపంచనీయరు, అందరు వచ్చినతర్వాత అందరును మిఠాయిని సమానముగ పంచుకొందురు.

ఈఅడవిజనులు విద్యావంతులసహవాసముచేసినతర్వాత వారిపూర్వపుగ్రామపద్ధతులను మార్చివేసి, చిన్నచిన్నవర్గములుగామారి, ఒకరిపైనొకరు కక్షలుకట్టి కోర్టువ్యవహారములకుదిగుట ప్రారంభమగును.

## హిందూస్త్రీల హక్కులు

### సిమ్లాలో సభవారి తీర్మానము

సిమ్లా, సెప్టెంబరు౫:-

హిందూశాసనోపసంఘమువారి సలహాలను విచారించుటకు అఖిలభారత మహిళాసంఘమువారి సిమ్లాశాఖయాజమాన్యమున సభజరిగెను- సభకు శ్రీమతి రాజకుమారి అమృతకౌరుసతి అధ్యక్షత వహించెను- లాహోరు హైకోర్టులో ఇదివరకు న్యాయమూర్తిగా నుండిన సర్ జయలాల్, శ్రీ కె-వ జీవరావు, ఎస్ ఎన్. రాయిగారలు చర్చలలో పాల్గొనిరి.

ఈసంస్కరణలను తమకుమాత్రమేగాక హిందూసంఘమంతటికిని తాముకోరుచుంటిమని అధ్యక్షతవహించిన శ్రీమతి అమృతకౌరుసతి చెప్పెను-అందరికిని సమానహక్కులుండవలెనని తాము పోరాడుచుంటిమనెను-ఇప్పుడు విద్యావంతులొక్కరే నష్టపడుటలేదు-మీరందరును నష్టపడుచున్నారు-ఇంకను మనకు జయముకలుగలేదు- కాని మనప్రయత్నములు సఫలమగునని మనకు నమ్మకముకలదు-అని ఆమెచెప్పెను.

హిందూశాసనములలో అక్కడ ఒకమార్పు, ఇక్కడఒకమార్పు చేయక హిందూసంఘమునకు, స్త్రీలహక్కులకు సంబంధించిన హిందూధర్మములను క్రోడీకరింపవలెనని ఉపన్యాసకులు కోరిరి.

సర్ బి.యల్ మిత్తర్‌గా రుపన్యసించుచు హిందూశాసనోపసంఘమువారు హిందూధర్మమునంతటినిసమగ్రముగా సింహావలోకనముచేసి, ప్రస్తుతకాలమునకుతగినట్లుగా దానిని క్రోడీకరించునట్లుగా చేయవలెనని చెప్పిరి

భూములతోసహా అన్ని ఆస్తుల వారసత్వము విషయమున శాసనముచేయు అధికారము ఇండియాప్రభుత్వము వారికి, రాష్ట్రీయప్రభుత్వము వారికి యిరువురికినుండునట్లు ఇండియాప్రభుత్వ శాసనముసవరింపవలెననిరి

హిందూశాసనోపసంఘమువారు ప్రసిద్ధ న్యాయవాదులఅభిప్రాయములు కోరిరని సర్ జయలాల్‌గారుచెప్పిరి. వారు కొన్ని మంచిసూచనలను గావించిరనియు, అవి బయటికివచ్చినప్పుడు ప్రజలు వానినిఆమోదింతురనియు ఆయనచెప్పెను.

తీర్మానము

సభవారేకగ్రీవముగా నీక్రిందితీర్మానము గావించిరి:- స్త్రీలహక్కులకు సంబంధించిన హిందూ ధర్మశాస్త్రమంతయు క్రోడీకరింపబడవలెనని హిందూశాసనోపసంఘము గావించిన సలహాను ఈసభవారు సంపూర్ణముగా ఆమోదించుచున్నారు-పురుషులు, స్త్రీలు సమానులు-ఎవరికితగినవిధులు,హక్కులు వారికికలవు-అను సిద్ధాంతముపై ఈక్రోడీకరణము ఆధారపడియుండవలెను-వారసత్వమునకుసంబంధించిన ధర్మశాస్త్రమును క్రోడీకరింపవలసినదని సదరు సంఘమువారు కోరబడిరని మాకుతెలియుచున్నది-ఇందుకై అంగీకారము జరిగినందులకు సంతసించును, పని శీఘ్రముగా జరుగవలెనని సభవారుకోరుచున్నారు-హిందూధర్మశాస్త్రములో నచ్చటఒకమార్పు యిచ్చటఒకమార్పుచేయుట అనర్థము, నిష్ప్రయోజనమని ఉపసంఘమువారు చెప్పినమాటలతో ఈసభవారు ఏకీభవించుచున్నారు."

## సాక్షమాపణ కర్త మేమనుకొన్నారు? అది నాకు గౌరవప్రదము!

### బహద్దర్ యార్జంగుగారి వివరణ

నవాబు బహద్దరు యార్జంగుగారు ...తూరు సభలో ౨ ఆబాన్ నాడు మాట్లాడుచు ఇట్లుసెలవిచ్చినారు:

"నాయజమానిమనస్సులో నాపైఅనుగ్రహం తప్పియుండెను. అప్పుడువారియెదుట శాంతలంచుట నాధర్మమైయుండెను. కొందరు నాకును నాయజమానికిని సంబంధించినవిషయాన్ని నాకును నా ప్రభుత్వానికి సంబంధించినదిగా నిరూపించినారు. నేనిచ్చిన క్షమాపణపత్రముపై నాకుగర్వముకలదు, ఈగౌరవము మరెవ్వరి అదృష్టములో ఉంటుందిమరి? దీనిపై నేనువిర్రవీగుచున్నాను, నాకునేనే మీపక్షాన ధన్యవాదమిచ్చుకొంటున్నాను నేనుయజమానిఆజ్ఞల నుల్లంఘించలేను. వారిప్రకృతిలో కోపంకనబడితే నేను క్షమాపణను వేడుతాను. నేను మొదటినుండి విశ్వాసపాత్రుడను, సక్రమ రాజకీయాందోళనము ఇప్పటికిన్నీ కలదు.

ఇత్తేహాదుల్ ముస్లిమీనువారిదివరలో మంత్రులనుగురించి చేసినతీర్మానము రాజకీయనియమాననుసరించినట్టిదైయున్నది- నాతండ్రిఅయినాసరే మంత్రిస్థలంలోఉంటే నేనుఆదేమాట అంటూఉంటిని.

ఇప్పుడు క్రొత్తగావచ్చిన ప్రధానమంత్రిగారు నాకు పరిచితులైనవారు. వీరు అనుభవశాలురైన పరిపాలనదక్షులు- అతడు మంచిహృదయముకలమనిషి- హైద్రాబాదుయొక్క ప్రభావము వారినిమార్చివేయకుండినచో అతనిసచివత్వము జాజ్వల్యమానంగానుండును. కొత్తమంత్రిగారినుండి నాలుగువిషయాలుకోరుచున్నాము:

(౧) ప్రభువుగారి అధికారాలు సంపూర్ణమై అవిభాజ్యమైయుండవలెను. ప్రభువుగారి అధికారాలను పంచుకొనజూచు ప్రయత్నాలన్నియు శాశ్వతంగా విధ్వంసముకావలెను.

(౨) హైద్రాబాదు రాష్ట్రము బ్రిటిషువారితో చేసుకున్న సంధిషరతులవిషయము స్పష్టంకావలెను-

(3) హైద్రాబాదు ప్రభుత్వముతనస్నేహితులగు బ్రిటిషుప్రభుత్వానికి సైన్యమును, ఆయుధాలను ఎక్కువగాఇచ్చి సహాయపడవలెను.

(౪) ప్రభుత్వవిధానములో ముందు కాలములో సంస్కారమున కవకాశముకల్గించవలెను- ఇప్పటిమంత్రిగారుమంచివారు- తక్కువజీతాన్ని ఒప్పుకున్నారు- వారు రాష్ట్రములో లంచగొండితనములేకుండా పక్షపాతములేకుండా చేయవలెను

### రాకడ

సర్ మిర్జాఇస్మాయిల్‌గారును సర్ రజాఅలీగారును హైద్రాబాదునకురానున్నారు.

## గోల్కొండ గ్రంథాలయము

గమనిక — ఈక్రిందివిషయాలను గమనించవలెను ఇదివరలో వీటినేఅవలంబించినప్పటికిని స్పష్టముగా తెలిపియుండనందున ఇప్పుడు తెలుపవలసివచ్చినది.

౧ విమర్శనార్థము గ్రంథావంపువారు రెండేసిపుస్తకములను పంపవలెను, లేకున్న ఆగ్రంథము విమర్శింపబడదు

౨. విమర్శను పత్రికాసంపాదకుడే చేయునని తలపరాదు, అర్హులైనవారిచే విమర్శలు వ్రాయింపబడును. విమర్శకులపేరులను ప్రకటింపము. విమర్శకుడు అంగీకరించినచో ప్రకటింతుము.

3. విమర్శపై ప్రతివిమర్శలను ఇదివరకెన్నడును వేసుకొనలేదు. ఇకముందును ప్రకటింపబడవు

౪. గ్రంథముంపినవారికి విమర్శయైన పత్రిక పంపబడును. ఒకవేళ పొరపాటుచే పంపకున్న గ్రంథకర్త జ్ఞాపకముచేసినపంపుదుము కాని పంపకుండిన ఆదోషతప్పుగా పరిగణింపరాదు.

గో. ప. సం]

౧. హైదరాబాదు ఫారెస్టు మేగజైన్ జులై ౧౯౪౧ నాటిసంచిక

హైదరాబాదు అటవీశాఖవారు త్రైమాసిక పత్రికగా ప్రకటించుటకు ప్రారంభించినారు. ఇది మొదటిది. ౪౧ పుటలు ఇంగ్లీషులోను ౨౭ పుటలు ఉర్దూలోను లిపియున్నవి. పత్రిక చాలా ఆకర్షణీయముగాను అందముగానున్నది. ఇంగ్లీషులోనివ్యాసాలు అన్నిటికన్నియు మంచివ్యాసాలు. ఇదేపద్ధతిపై ముందుకూడానడిపిన ఈపత్రిక హైదరాబాదు మాసపత్రికలలో అలంకారయుక్తమైనదిగా ఉండును. ఉర్దూలోనివ్యాసాలు ఇంగ్లీషువ్యాసాలకు భిన్నించినవిగా ఉన్నవి. అటవీశాఖవారి యీకృషికి వారిని అభినందించుచున్నాము.

౨. గీతామృతము

స్నేహలతాకవితా సంఘముయొక్క ౨౮వ పుష్పము, కర్త వాజపేయయాజుల రామసుబ్బారాయుడుగారు, కొల్లాపురం, పుటలు ౨౪ వెల తెలుపలేదు- గ్రంథకర్తగారినుండియే లభించును. సుప్రసిద్ధకవులును మంచికవితాధార కలవారును అగు శ్రీవాజపేయయాజుల రామసుబ్బారాయుడుగారు వ్రాసినకవితకేమియు లోటులేదు భగవద్గీతలోని ఉత్తమములని వారుగమనించిన శ్లోకాలను తేటతెనుగు పద్యాలలో వ్రాసినారు.

3. ఖడ్గతిక్కన

కవిశిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, ౪౪ జేరా, సికింద్రాబాదు (దక్కన్) వెల ౮ అణాలు పుటలు ౩౬ గ్రంథకర్తగారినుండియే దొరకును.

కవిత అందరికిని పరిచితమైనదే. కథకూడా సుప్రసిద్ధమైనదే. ప్రారంభము అందముగానున్నది. శైలిసహజముగానున్నది. ధనియాలజాతి, గండరగండడు వంటిపదాలను సందర్భోచితముగా వాడినారు. ఇదివీరరసప్రధానఘట్టము విషాదాంతముకలది.

౪. సూక్తిసుధాలహరి

కవి పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు పిఠాపురం, తూర్పుగోదావరి జిల్లా, పుటలు ౧౮౨ వెల కల్దారు ౧౨ అణాలు. ఈగ్రంథముగ్రంథకర్తగారివద్దనే దొరకును.

ఇదుపద్యములును వచనములునుకలవు. ప్రాచీనమహాకవుల కృతులనుండికొన్నియు మాధ్యకాలమునుండిన కవులనుండికొన్నియు పద్యాలెత్తిముద్రించినారు. పద్యభాగాలుకొన్ని మంచికథలకుసంబంధించినభాగాలు, వచనభాగముసగము కలదు. అందుఆధునికులను ౧౯వ శతాబ్దము వారును అగుపండితులనుండి తీసుకొని ముద్రించినారు. ఈగ్రంథాంతమందు కఠినపదముల టిప్పణియుకలవు. ఇదిపాఠశాలవిద్యార్థులకుపయుక్తమగుటకై శ్రీశాస్త్రిగారుశ్రమించి మంచిభాగాలనువీరి కూర్చిముద్రించినారు ఈగ్రంథము విద్యార్థులకత్యంతోపయుక్తమైయున్నది.

## హైదరాబాదు బజారు ధరలు

తేదీ ౫-౧౨-౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము ధరలన్నీ హాలీకి.

| వస్తువు | పల్లా ౧కి ధర రూ | అ | పై | |
|---|---|---|---|---|
| కిచిడీ సాంబర్లు | ౨౩ నుండి ౨౪౬ | | | |
| సంబర్లు | ౨౩ | ౦ | ౦ | |
| ఢిల్లీబోగాలు | ౨౨ | ౮ | ౦ | |
| రాంసాగర్లు తెల్ల | ౨౨ | ౦ | ౦ | |
| జానక్రాం | ౨౧ | ౬ | ౦ | కొత్తవి |
| ,, | ౨౩ | ౦ | ౦ | పాతవి |
| ఆర్కాటి | ౨౨ | ౦ | ౦ | కొత్తవి |
| ,, | ౨౨ | ౦ | ౦ | పాతవి |
| గోనామణి | ౩౦ నుండి ౨౦ వరకు | | | |
| బుడంకులు | ౧౮ | ౬ | ౦ | |
| జీరాశి | ౨౦ | ౦ | ౦ | |
| గోధుమలు | | | | |
| షర్బతి | ౨౨ | ౮ | ౦ | |
| బన్సీ | ౨౩ | ౦ | ౦ | |
| లక్ష్మీ | ౨౦ | ౦ | ౦ | |
| పాటిదారా | ౨౦ | ౦ | ౦ | |
| ఎర్రగోధుమలు | ౧౮ | ౬ | ౦ | |
| జొన్నలు | | | | |
| తెల్ల జొన్నలు | ౧౨ నుండి ౧౬ వరకు | | | |
| పచ్చజొన్నలు | ౧౧ | ౧ | ౦ | |
| మడికట్టు జొన్నలు ౧౨౬ | ౧౧ | ౦ | ౦ | |
| సెనగలు | ౧౪౬ పరదేశీ ౧౮౧౦ దేశీ | | | |
| కందులు రోత్రవి | ౧౦ | ౬ | ౦ | |
| మినుములు | ౧౪ | ౮ | ౦ | |
| అంకలు | ౧౪ | ౮ | ౦ | |
| సజ్జలు | ౧౧ | ౪ | ౦ | |
| పప్పులు | | | | |
| సెనగ పప్పు | ౨౩ | ౦ | ౦ | |
| కంది ,, | ౧౬ | ౮ | ౦ | |
| పిరిసెనగ ,, | ౨౧ ౨౨ | ౮ | ౦ | |
| అంక ,, | ౧౮ | ౧ | ౦ | |
| మినుప ,, | ౨౧ | ౦ | ౦ | |
| పెసర ,, | ౨౦ | ౦ | ౦ | |
| బెల్లము | ౧౪౬ నుండి ౧౬ వరకు | | | |
| ఉప్పు | ౧౨, ౧౧ | ౮ | ౦ | |
| పుల్లిగడ్డ | ౧౬ నుండి ౧౨ వరకు | | | |
| వరుగు మంచిది | ౯౦ నుండి ౨౧ వరకు | | | |
| చక్కెర మణుము [౪౦ సేర్లు] | | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ | |
| బొంబాయి ,, | ౧౩ | ౧౪ | ౦ | |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజామాబాదు ,, ,, | ౧౩ | ౧౨ | ౦ | |
| ఎర్రచక్కెర ,, పల్లా | ౧౩, నుండి ౧౫ వరకు | | | |
| దర్గచక్కెర ,, ౪౦ సే. | ౧౬ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే. | ౪ | ౧౨ | ౦ | |
| అల్లం ,, ,, | ౪ | ౧౨ | ౦ | |
| మణుము ౧౨ సే | | | | |
| కొబ్బెరనూనె ,, | ౪ | ౮ | ౦ | |
| కుసుమనూనె ,, | ౫ | ౦ | ౦ | |
| నువ్వులనూనె ,, | ౪ | ౮ | ౦ | |
| వేరుసెనగనూనె ,, | ౪ | ౦ | ౦ | |
| కిరోసీన్ (గ్యాస్) ,,డబ్బా ౧కి | ౪-౧౨-౦ | | | |
| నెయ్యి మణుము ౪౦ సేర్లు | | | | |
| విదరు నెయ్యి ,, | ౩౦ | ౦ | ౦ | |
| తెలంగాణా ,, | ౪౫ | ౦ | ౦ | |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ | ౨ | ౦ | |
| బంగారు తులం ౧కి | ౫౦ | ౮ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౩౧ | ౬ | ౦ | |
| ,, తు ౧కి | ౦ | ౧౧ | ౬ | |
| సవరన్ ౧కి హాలీ రూ- | ౩౩ | ౮ | ౦ | |
| మారకం | | | | |
| హాలీకి కల్దార్లు | ౧౬ | ౫ | ౬ | |
| కల్దారుకు హాలీలు | ౧౬ | ౩ | ౬ | |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ | |
| వేరుసెనగ ,, | ౭ | ౪ | ౦ | |
| బుడ్లు పల్లా ౧కి | ౮ | ౪ | ౦ | |
| పప్పు ,, | ౧౨ | ౦ | ౦ | |

గమనిక:-

ధరలు మీకెవరికైనను సరియైనవిగా తెలుపుచున్నాము. ఆయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకారు.



## ప్రాచ్య విద్యా బిరుదములు

శిరోమణి–విద్యాప్రవీణ–విద్వాన్–భాషాప్రవీణ–ఉభయభాషాప్రవీణ– అనెడి మద్రాసు ఆంధ్రయూనివర్సిటీల పరీక్షాస్వరూప స్వభావముల నెరుంగని కొందఱు అబిరుదములవిలువను గ్రహింపజాలక తమచిత్తమునకువచ్చినట్లు ఒకసారి ఈపరీక్షలు మెట్రిక్యులేషన్‌తో సమానమనియు మరియొకసారిఇంటర్‌మీడియట్, బి.ఏ. తో సమానమనియు దుష్ప్రచారముచేయుచున్నారు. అట్టిఅవ్యవస్థితమతులైన అపోహలదొలగించి యథార్థమును తెల్లిపించుటయే ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

ఆంధ్ర మద్రపురీ విశ్వవిద్యాలయములవారు ప్రాచ్యవిద్యల ప్రోత్సహించుటకై అనేకసంవత్సరములక్రిందటనే సంస్కృతభాషయందును, ఆన్ధ్ర ఆంధ్రద్రవిడాది దేశభాషలయందును, పరీక్షలనేర్పరచి, సంస్కృతమున శిరోమణి, విద్యాప్రవీణయనియు దేశభాషలయందువిద్వాన్ భాషాప్రవీణయనియు, ఆయాపరీక్షలందుత్తీర్ణులైనవారికి ఆయాబిరుదములనిచ్చునట్లు ఏర్పాటుచేసిరి. ఆపరీక్షలకుపాఠ్యపుస్తకముల నిర్ణయించుటకు బోర్డుఆఫ్‌స్టడీస్‌లో ప్రాచ్యవిద్యా విభాగమును ప్రత్యేకించి అందుజగద్విఖ్యాత విద్యానిధులగు విద్యావాచస్పతి మహామహోపాధ్యాయ యస్. కుప్పుస్వామిశాస్త్రిగారు డాం. ఏ. మహామహోపాధ్యాయ కాశీసుబ్బరాయశాస్త్రిగారివంటి పండితప్రకాండులనియమించిరి. తిరుపతి మదరాసు తిరువయ్యార్, కుంభకోణము, నెల్లూరు, తెనాలి విజయనగరము, కొవ్వూరు, చిట్టిగూడూరు మొదలుగాగలపట్టణములయందుండు ప్రాచ్యవిద్యా కళాశాలలకు వేలకొలదిరూప్యముల వార్షికవిరాళముల ప్రభుత్వమువారు ప్రాచ్యవిద్యాభివృద్ధికై ఇప్పటికినిఇచ్చుచున్నారు. మరియు నచ్చటచ్చట పరీక్షాకేంద్రముల నేర్పరచియున్నారు. ఈపరీక్షలకు బి. ఏ. యం. ఏ పరీక్షానిబంధనల ననుసరింపకేని హెచ్చుతో పాటుపరీక్షల నిర్వహించుచున్నటికిని ఆంగ్లపట్టములకును సమానగౌరవము దొరకుటకు ఒకటేకాన్వొకేషన్ ఏర్పాటుచేయబడినది

శిరోమణి మన్నగు వానికరగ ఈ లు విశ్వవిద్యాలయమువారి (యూనివర్సిటి)చే అంగీకృతమైన (ఓఫిలియేట్ చేయబడిన) ఉన్నతప్రాచ్యవిద్యా కళాశాలలయందే ఉండగలవు, కళాశాలయందు శిరోమణికోర్సు చదువుటకుముందు ఎంట్రన్సు (ప్రవేశ) పరీక్షయందుత్తీర్ణులుకావలెను, ఇది మెట్రిక్యులేషన్ పరీక్షతో సమానమైనది గావున ఈఎంట్రెన్సు పరీక్ష ప్రభుత్వమువారిచే నిర్వహింపబడుచున్నది. ఈఎంట్రెన్సుపరీక్ష ౩ సంకి కోర్సు ఈ పరీక్షయందు ప్రతాపరుద్రీయము, శాకుంతలము నైషధము, మేఘసందేశము, కాదంబరి, వేణీసంహారము మొదలుగాగల సాహిత్యగ్రంథములు నిర్ణయించబడియున్నవి. శిరోమణి ౭ శాఖలుగ విభజింపబడినది. మీమాంసాశిరోమణి సాహిత్యశిరోమణి వేదాన్తశిరోమణి, వ్యాకరణశిరోమణి తర్కశిరోమణి, జ్యోతిషశిరోమణి, ఆయుర్వేద శిరోమణి అని. ఇందుఏశిరోమణికి పోదలచినా లో ఆశిరోమణికిప్రాతిపదిక గ్రంథములేవో వానియందు ఎంట్రన్సులోనే పరీక్షనివ్వవలెను. కాని అన్నిశిరోమణులకును విద్యార్థి. ఉభయభాషా ప్రవీణ ఏ భాగములకును ఎంట్రన్సుకు నిర్ణయించిన ప్రతాపరుద్రీయాది గ్రంథపఠన పరీక్షాపత్రమువాత్రము సమానము, దీనికే ఎంట్రన్సు సాహిత్యమని పేరందురు

అనగా నాటకాంతసాహిత్యము, సాహిత్యశిరోమణి విద్యార్థి ఏ తరగతుల చదువ నిచ్చగించు విద్యార్థికిని, వ్యాకరణశిరోమణి చదువువారలకు సిద్ధాన్తకౌముది పూర్తిగను, తర్కశిరోమణి చదువనిచ్ఛగించినవారికి ముక్తావళి, మీమాంసాపరిభాష అర్థసంగ్రహము, మొదలుగాగలవిపూర్తిగా ఎంట్రన్సు పరీక్షయందేకాగలవు ఇకశిరోమణియందు వ్యాకరణశిరోమణికి మహాభాష్యము, శేఖరము, మంజూష మొదలుగాగల గ్రంథరాజములు, తర్కమునకుశక్తివాదము, వ్యుత్పత్తివాదము, భాట్టరహస్యము, కుసుమాంజలి, ప్రామాణ్యవాదము మొదలుగాగలగ్రంథములు, సాహిత్యమునకురసగంగాధరము. ధ్వన్యాలోకము, కావ్యప్రకాశిక మొదలుగాగల అలంకారశాస్త్రగ్రంథములు, వేదాంతమునకు అద్వైతసిద్ధి గౌడబ్రహ్మానందీయము, ఖండనఖండఖాద్యము మొదలుగాగల గ్రంథములును ఇట్లుఆయాశాస్త్రశిరోమణులననుసరించి పూర్తిశాస్త్రగ్రంథములు పాఠ్యగ్రంథములుగా నిర్ణయించబడినవి. ఈశిరోమణి రవత్సరములకోర్సు. ఇందుమాక్సానల్ మాక్సుముల్లర్ కీత్ బ్రూగేమన్ మొదలుగాగల సంస్కృతభాషాశాస్త్రవిదుల గ్రంథరాజములు పాఠ్యగ్రంథములుగా నిర్ణయించబడినవి, ఈశిరోమణి బిరుదము ఎం. ఏ. తో సమానము, ఆన్ధ్రభాషాప్రవీణ విద్వాన్ ఉభయభాషా ప్రవీణబిరుదములు ఎం.ఏ తో సమానములు. సంస్కృత యం.ఏ, పరీక్షార్థి వ్రాయులిటరేచర్ మార్ఫాలజీ పేపరుకు సంబంధించిన పుస్తకములు సంస్కృత భాషలో శిరోమణి విద్యార్థి ఏ క్లాసుకుబోధింపబడి ఆగ్రంథము లకు సంబంధించిన పేపరు ఆంగ్లమాధ్యమముతో ప్రత్యేకించబడిన M. O. L. P. O. L. B. O. L, అను డిగ్రీలు శిరోమణివిద్యార్థి ప్యాసైనవారికి ఆంగ్లమునందు పాండిత్యసంపాదనకుఏర్పరచినవి గానీపటిపైడిగ్రీలుకావు శిరోమణ్యాది పరీక్షలలో ఏదోఒకటిప్యాసై ఆంగ్లభాషాజ్ఞానము స్వల్పముగ నున్నవారు ఏర్పరచిన P. O. L B. O. L. M. O. L పరీక్షలకు వెళ్ళవచ్చును.

కనుక ఈ P.O.L. B.O.L. M.O.L. పరీక్షలుశిరోమణిపైపరీక్షలుకానేకాదు. ఈ P.O.L మొదలుగాగల పరీక్షలలో సంస్కృతభాషలో ఏపేపరును వ్రాయరు. అదియంతయు ఆంగ్లభాషకు సంబంధించినది.

ఈ విషయములనుగమనించి శిరోమణ్యాదిప్రాచ్యవిద్యాపట్టములకు తగిన గౌరవమొసంగుదురుగాక!

ఇట్లు,
ధర్మపురి శేషగిరిశర్మ.

